రమెత్తదిగ్గజకదంబము నెక్కియు దాత్తసైనికం । ద్రోత్తమపుంబి
ఘోరబకరథోగ్రవిహారము లిద్ధవాద్యముల్ । మొత్తము గాఁగ వాఁ
కిరల భూతబలంబును వారె మర్చుచున్ ॥ సీ ॥ వరభల్లములు పె
ల్లడరవిల్లవనినొల్ల బడఁ గల్లడిలు నల్లభటచయంబు । స్ఫుటకాండము
లకాండములు మొండగుచుఁ జెండ వడిఖండలగు కొండ వారములు
ను । ఘనకంకణములతాంతగతిఁ వఁతలిడవింత గనలంతఁ బహు కాంత
కరిసులఁబు । విమలక్రకచవిక్రమనువక్రతలు గాక్రమతఁ జక్రము
వఁబహునుతగథములు । డొల్లుశిరములు మునియ్యలై త్రెళ్లుకరము । ల
య్యైనుద్దండపుణిసమూరాగ్రగణ్య । శూరపద్మాసురామాత్య
ఘోరతరవి । హారసంగరముఖిలాండవాగముడల ॥ చ ॥ విడివడివీ
రబాహుముఖ వీరులు దానవరాజమంత్రులన్ । గమువడిదాఁకవార
లునఖండపరాక్రమమూర్తిఁ బోరున । పృథుశరధుర్యవృత్తి ఘనపుం
జము గోధరవృత్తి సూర్యుఁడున్ । జడధులు కాండరాశితయు సత్య
ము గాఁగని యొన్ స్థిరస్థితిన్ ॥ ఉ ॥ రత్నవధూసుమారుబుభరంబు
గఁబోరుచునంతకంతకున్ । నూత్నపరాక్రమంబులుగ నుంగొను
చున్ సురవైరిమంత్రులన్ । యత్నమెలర్పఁ ద్రుంచిన జగావళిబాసి
ధరిత్రిఁ ద్రావాలిరో । ప్రత్నగుణాఢ్యశైలశిఖ రాళిశిలల్ వడిఁ గూలునై
ఖరిన్ ॥ క ॥ ఆదిత్యానుజముగణము । చేదవులునశౌచకంబు చేవిడవ
డనా । నాదిత్యుఁడు వననిధినపు । డాదరమునఁ గ్రుంకి వచ్చె నమ
లాంశుకుఁడై ॥ అప్పుడు ॥ సీ ॥ తనపట్టిచలపట్టిఘన శౌర్యమనివా
ర్యగతి మీరనొక యోరగ దిశింపుడువఁ । దనతమ్ముఁ డెపఁగమ్ముకొను
కోపమునురూపమును గాంచనొకయంచమెనసినడువఁ । దనమూ
లబలజాల మనిలోకములవీఁకఁ గనిద్రింగ నొకచెంగటను జెలం
గఁ । దనమిత్రతతిగోత్ర ధరకోటియనమేటి రుజబండనొకదండ
రొప్పియుడర । బడబదావలయాంబుధి ప్రళయజలద । యుత్తమైవ
చ్చు హాలాహలోరుచండ । విభవములలారఁ దేరెక్కి వెడలెనసకి ।
శూరపద్మాసురుఁడు తూర్యవారమెసఁగ ॥ మ ॥ ధరణీచక్రముగూ
లనిట్లడరి దైత్యస్తోమము క్కక్కసం । గరభూమిన్ వరవర్త్రినా

శ్రమునన రక్షస్స్వామి భూకర్ణికా । వరముగా మిత్రవితాన కే
సరము భిభ్యద్వాహానీ సస్థళో । త్కరముగా శూరమగాళ
ముగా గలుగఁబన్న వ్యూహమై నిల్చెనఁగా ॥ చ ॥ అతులాయ
త్తవిభూతి దైత్యులకుముల్లెపన్ని కొల్పివ్వను । ధృతిభూతప్రకరం
బురుప్రబలముగా డాఁకెఁగా ధరాధూళియుగా । గృతకక్షోణికిభ
ద్రవాళిమణులై కీలాలదంబుల్ కుసు । త్రత్రియై వీరయశఃపరాక్ర
మములుద్భృత్ప్రవంతాచిగాఁగా ॥ మ ॥ ధరకెంధూళినభోనదిఁగా
జలధులఁగా దానెల్ల జేయంగఁద । త్వరిపూర్ణత్వముమాపునయ్యా
భయశుంభత్తై స్వన్యశస్త్రాస్త్రభీ । కరఘాతంబులనుబ్బరక్తజల
ధుల్ గన్పట్టెనందున్నరు । త్వరిధూతోరుకణాళిచెమ్మయయిదో
పఁగా దత్ప్రవత్యంగబుధుల్ ॥ ఉ ॥ అత్తఱివీరబాహుఁడుమహోగ్ర
హామూర్తివహించి వేడ్కమై । మత్తగజంబుఁదాకుఁహరిమాడ్కి
నిశూరునిదాఁకిదివ్యబా । ణోత్తమశక్తిబల్ పిడుగు నొప్పిదముగా
గనిమీఱితక్కువా । రుత్తలనుండ మొగ్గరము నొక్కటిజొచ్చెసురు
ల్ నుతింపఁగా ॥ వ ॥ ఇట్లుమణిపుత్రుండుగ్రరసోల్లసితమూర్తియైనా
నాదళంబులు చెదర చక్రవ్రాతంబు బెదరన కాలవలాహకంబుపగి
దింప్రళయసమయభీమకరణి- శరవర్షంబునంబకవహ్నిజ్వాలలును-
నిండింపఁగూలుకరులునుద్రావాలు హయులును విరుగు తేరులునునొరు
గువీరులునునైభ్రమించునమ్మహావ్యూహంబున - మిట్టిపడి - వీరా
గ్రజుశక్తిచేనొచ్చిమరియుదాఁకి - తదాగ్నేయాస్త్రంబునసోలి- పె
డుగడచినతోడనెకొరవిదాఁకిన వానిపగిదియై - దోలఁగుసింహ
వక్త్రునిగడచి కొండలుకర్బుర పతులక్కఱువిందనందనుంబొడు
వుటగుండ్లు మునింగిబెండ్లుదేలి నట్లయిన విజృంభించి - మెయి
వెంచియతండు - మెఱుంగుమెఱసిన తెఱంగునఁ గొఱవి త్రి
ప్పినవెరవున - నింద్రజాలంబుజూపిన చందంబున నిజస్యందనం
బుతో నెందుజూడినం దానయై యంకటికన్నిరూపులై యొకిక దే
రిచూడరాకమూకలకుటికిచీ కాకు జేయుచు - మొనలనురుమాడి
త్రోయుచు - నావరణంబులఁబీనుంగు పెంటలచేయుచు :

నెదురువారిఁదలలుగోయుచుఁ బారువారిఁ బాయుచు - రండురం
డనియెలుంగెత్తి గూయుచు - కరంబెత్తి వ్రేయుచు - లీలావహస్ఫూ
ర్తిగలవీరమణిగాన - దానవద్విరద భంజనంబును - మహామర
హితఫాలుండగు ఫణిభవుండుగాన - పరజీవహారణంబును - స
హాయాసంబునసల్పుచు - గళవీథులుగడిచి కేసరంబులనొడిచి -
కీర్ణికఁ జేరంజనునవసరంబున ॥ ఉ ॥ ఒంటరిగాఁగవచ్చితివెయొ
ప్పనసీధృతియెన్నరమ్ము నా । వింటిబలమ్ము జూతువని వేగమ తేరటు
దోలఁబంచిము । క్రూరటికుమారుఁడాఁ గెంగినుకన్ బలుదీడుచు భా
నుకోపుఁడా । దంటయువానిడాయుడు మదావళయుద్ధముబో
లెపోరటన్ ॥ చ ॥ రయమునభానుకోపుఁడమరప్రభుశస్త్రము
బోలునమ్ములన్ । హయములసూతునిన్ దునిమియార్చినభీకరఖ
డ్గము త్రిప్పి । స్మయగతివీరబాహుఁడలమానిసితిండిరథంబు జేరిని । శ్చ
యమతిసూతుఁదున్మి సిగఁబట్టుకఁ ద్రుంచెనరాశిమస్తముల్ ॥ గీ ॥
ద్రుంచిపొలిపోనిమదమునమించిశిరము । కేలగొని వేమరలువానివా
లియాగి । సింహముఖనందనశతంబుసింహవిక్ర । మమునశరవర్ష
ములముంచిమారుకొనుడు ॥ శా ॥ విద్యుద్వల్లరితోడిబల్ పిడు
గునాఁ వీరుండు ఖడ్గంబుతో । నుద్యద్విక్రమమూర్తి రేచి సుగభిద్వోర్ధృధు
ల్ భయంబందఁద । న్మాద్యత్స్యందనపాళిపైకుఱుకుచున్ మస్తాళి
స వ్యగ్రయ । శ్రావ్యత్వుండయిచెండెనిర్జరప్రసూనాసారము
ల్ వర్షింగన్ ॥ గీ ॥ ఇటులసింహాస్యనందనచ్ఛటవధించి । భానుకో
పునిశరముచేపట్టివీర । కందుకంబాడికొనుచుమొగ్గరమువాసి ।
హరజునకుపాయనమువట్టెనశ్వసుతుఁడు ॥ క ॥ సురరక్షితపెంపూర్వా
షము । గరుడుఁడుగొనిచ్చుబిసువుగాదీడీని । గ్ఘరవిక్రమమున
కనిసుర । వరులుబొగడమునలెవీరబాహుఁడవలా ॥ అప్పుడు ॥ చ ॥
పుటపుటనైనిజాత్మజులపుంజములంజము ప్రోలికన్పిచి । స్ఫుటమ
తిఁబోవగాంచియురుభూరితరోద్ధతి సింహవక్త్రుఁడు । ధ్భటభయ
కంపనన్ మరలు వాహినులన్ బురికొల్పి ఘోరరసు । కుక్కుటములనం
బకవళులుగుర్యమణీసుతుఁడాఁకెదాఁకినన్ ॥ ॥ సీ ॥ కాలమృ

త్ర్యసహాస్రకాళిముల్ దూరుసారంగారిముఖసహస్రములగాం
చి (కాలదండస్ఫురత్క్రౌర్యముల్ గనుసశస్త్రభుజాద్విశతకదశం
బుఁ జూచి | కాలకూటాఖండగరిమంబుదురుసరౌద్రస్ఫారరసవ
త్స్వరంబు నెదిరి | కాలపాశవిశేషకలననవ్వుచునగ్నికణముల
నుమియువీక్షణములరసి | బడబసంవృతదవకీలపగిది మెఱయు | బా
డబసహస్రపంతంత్రభవ్యరథము | గని యిదేసింహవక్త్రుండుగదిసె
ననుచు | భయముమైసర్వభూతముల్ పఱువులెత్తె || ఉ || అప్పుడువీ
రబాహుఁడు నిజానుజులున్ గణనాథముఖ్యులున్ | గుప్పలుగూ
డి ధైర్యరమగూరగజంగమనీలశైలముల్ | దుష్టమదుల్ప్రదాఁకుబల
ధూర్వహశిల్పికులంబుబోలుచున్ | గప్పిరిబాణటంకములగంధగ
జాంతకపాళిపైవడిన్ || మ || నవవీరేంద్రులురుద్రనాథులుననూ
నస్థైర్యదుర్వారులై | దివిజారాతిపయిన్ దగన్ నెరపునుద్దీప్తాస్త్ర
ముల్ తన్మహో | గ్రపటంబందళిపఙ్క్తినాఁదనరెదక్షుస్త్రీసమమో
హాహామణీ | భవపుత్రాస్త్రతతుల్ శిలీముఖములౌ భావింపనం
చెన్నఁగన్ || చ || మఱియునుదారరౌద్రమహీమల్ దగవీరముఖు
ల్ గడంగిచె | చ్చెరనురుదివ్యబాణములు జేకొని నింపఁగఁదచ్ఛ
రాళియు | క్రూరహరివక్త్రగాత్రములయందఱి నాటిచెలంగెనేమ
పైఁ | బెరిగినకంటకంబులనభీతిసురావళిపెచ్చలించఁగన్ || ఉ ||
మానిసితిండి చేమరగిమూకివారముకాటుకోడియే | పూనిచె
లంగుబెబ్బులి సమున్నతివీరగణేశబాణసం | తానవిఘాతముల్ బె
రుగదానవుఁడేపున వేయువిండులన్ | బూనియొనర్చునానిరుతి
భూతములన్ దలకించెనయ్యెడన్ || సీ || చక్రపాదస్థితాశ్మకుమా
రవారనీహారఘోరస్ఫారసౌరభ్యములు | రౌద్రతానిర్నిద్రరుద్ర
శస్త్రధ్వాంతసంతానదావాగ్నిసంముఖములు | గణనాథధిక్కృ
తగంధసింధురబృందజంగమహాస్మాధరశంబరములు | పూర్వయుద్ధ
క్రాంతపూర్వగీర్వాణసస్యచ్ఛాయదవికాలజలధరములు | శర
జచతురంగమృగకులహరివరములు | సురవిలోకనబంభరోత్కర
కనకకము | లైనిసుడసాగెసింహవక్త్రాశుగాస | ముక్తదండాభశర

కాండభూరులవుడు ॥ చ ॥ విలయవలాహకంబనఁగ విక్రమదుర్ధ
ముఁడాశరుండువి । చ్చలవిడికాండవర్గమున సర్వగణావళిఁదేలఁ
జేయుచున్ । సెలలనుదివ్యబాణములచేకొనిరొప్పుచునుక్కడంచు
చున్ । గలయజరించెమందరముకై వడిసైన్యపయోధిలోపలన్ ॥
మ ॥ నవవీరుల్ మదిషణ్ముఖున్ నిలిపి సంధానంబుమోక్షంబు
క । న్నవకుం దోఁపఁగ నాకదివ్య శరసంఘంబుల్ వడిన్ గప్పు
చున్ । దివిజారాతినిజుట్టుకెన్ననఁగ నాఁ ధీరంబుక్షీరాబ్ధియం ।
దువడిన్ విభ్రమణంబొనర్చుగిరినాల్ దోఃపన్ మహోగ్రస్థితిన్ ॥
సీ ॥ తొమ్మిదితొమ్మిదియమ్ములవాణిపుత్ర నవకంబు కేతుదండము
లనుసుమ । పదియాఱుపదియాఱు ప్రదరంబులావీరవరులసార
థులనువడివధింప । రెండురెండుద్దండకాండంబులావీర పురుషో
త్తములచాపములహతింప । నిరువదియిరువదిశరవరంబులువారి
బలతురంగచతుష్కములనుగూల్ప । నాల్గునాలుగుబాణగణంబు
వారి । మకుటములద్రుంపనొకపాశమకటవారిఁ । గట్టవెయికా
ర్ముకంబులొక్కటనెవంచి । వెయిశరములేసిదనుజుండుపేర్చియా
ర్చె ॥ ఉ ॥ అంతటభిల్లజాలకచయంబులద్రుంచి చెలంగుపుండరీ ।
కాంతకడింభకంబులన నశ్మకుమారులుదైత్యపాశమా । వంతలు
గాఁగఁజెండుచుర యంబునదండములెత్తియొత్తిక । ల్పాంతకవై
రులల్లుదనుజాధముఁడాఁకిసురుల్ నుతింపఁగన్ ॥ ఉ ॥ అంతితలీ
లనాహరిస హస్రము సూతశతంబుద్రుంచివి । స్ఫంచినిశాట
రాజుభుజ పీఠులుగ్రక్కదలంగవీకలం । ఘించికిరీటముల్ డులిచి
కేవలశక్తిఁదనీయఫాలముల్ । చించుచునొచ్చియార్చె సురశే
ఖరవీరులమీఁదియల్కతోన్ ॥ చ ॥ కరములుసాఁచివీరనవకంబును
నొక్కటబట్టిఘోరభీ । కరతరపాశపాళులను గట్టినిజాగ్రజుచెం
తవెట్టిమం । దగిరిబోలెషణ్ముఖుని దండునదండముబూని ఘో
టకో । త్కరకరివాగముల్ ధరణిదార్చుచునార్చె సురారియేపు
నన్ ॥ మ ॥ విలయాంభోధరగర్జనంబనఁగఁ దద్వీరారవంబీశభూ ।
బలసంఘంబులమూర్ఛవుచ్చి దిశలన్ బల్మిన్ ప్రతిధ్వానముల్ ।

వెలయఁగ జేసినఁ దద్రవంబు వినుచుఁ వేల్పుల్ దగఁ విన్నవిం।
పలసచ్చాపేర్శ్వర సాభిరాముఁడయి షడ్వక్త్రుండు తీవ్రంబునన్॥
సీ॥ హరిదంగనోత్కృష్ట వరసుమగుచ్ఛశం కాకృద్ధరాధర కాం
డమగుచు। శౌర్యతాళీకహతాంచతాక్రంస్యతాళీకృ తేలాహరి
పదంతగాళమగుచు। సురలోకవర్షితసుమవర్షధీరృద బ్దాసీకక
రకావయంబులగుచు। దేవతాహతసుభేరీవరాభధ్వనితగుహో
త్రకులనగతండమగుచుఁ। బతుపింఛానిలంబులుబరగరత్న। చాప
విద్యుద్ధృతాబ్జింబుజాడనెగడు। నీలకంధర మైయొప్పనిర్జరేంద్రు।
నెక్కిహరిముఖుఁడాఁడాఁకెనుక్కు మీరి॥ చ॥ ఇటుపదుఁడాఁకు
నాతనినిరీక్షణమాలిక లెందుఁబర్వను। ద్భటగతి లేవిరుద్రులుసబా
శకులంబెడబాయవీరులుఁ। జటులరయంబు మైఁబొది విశాత్రవు
నెమ్మెయికొండనెక్కలా। గటువడి నెక్కెమస్తకరకాండసలంబు
లుడుల్చిరేపునన్॥ చ॥ హతకరమస్తకాళిమరియద్భుతలీలజనిం
పనొప్పయా। దితిభవమాళివారలనుదీప్తబలంబునఁబట్టిపట్టియు।
ద్ధతిఁబృషదంశకంబు మళకావళినొక్కటమెక్కవైఖరిన్। గతిప
యికాష్టమాత్రమునగైకొనియందఱు మెక్కియార్చినన్॥ చ॥ ద
రహాసనంబుతో గుహుఁడు దానవుఁజూచి కరాశుగాసనం। దు
రుగుణమెక్కఁజేసి విశిఖోత్తమముల్ నిగుడింపమాటికిన్। ఖరుఁ
డెడలేక లేక విశిఖత్వముఁ బొందుచుఁ బోరెనబ్బురం। బరిదియటంచు
దేవనివహంబు భ్రమించి నుతించుచుండఁగన్॥ సీ॥ మణికార్ముక
సహస్రమహితుఁడై శరవృష్టినిగుడించియార్చుచు నెగడువాని।
దురిన్నరీత్యుగ్రప్రభాతులితుఁడై కరదండసాహస్రముల కవ్విజదుపు
వాని। నతిమహాబలరమాపితధుఁడై కఠినపరాగవారమ్ము వైచిగేలి
గువానిఁ। గాలకూటాకారకలితుఁడై ప్రబల హేతికదంబకముల వైచి తే
గడువాని। సింహవక్త్రునిక్రమమునశివసుతుండు। ఘోరహరియనఁద
గుమనసీంరరత్న। మనహరుండన నెమరించియస్త్రశస్త్ర। కౌశలంబున
నడఁచిశంఖంబునొత్తె॥ చ॥ మరియునరాశిరేఁగిబలుమాయలొనర్చి
నదివ్యబాణముల్। బరిపిన పెక్కునేర్పులనుబన్నినమాటికినుక్కడంచి

యు। క్రూరఁబలువాఱుమస్తకచయంబులఁదుల్చుచుమూర్ఛవుచ్చెఁ
దా। నరిమురికొండదిం ద్వనుజనాధివరుండడలించుపోలిక౯ ॥గీ॥
ఇటువిసోదంబుగా జగదీశ్వరుండు। దనుజుతోఁబోరుచునుగట్టి
మొనలయాబ్ధి। పగిదిఁదనుదాఁకవచ్చుటనగుచునరసి। కరసుద
ర్శనమూ సేనగరచఁబనుప॥ సీ॥ అరదంబులనుగాల్చి శగదంబులను
బోల్చి గడఁగుమత్తగజేంద్రఘటలఁగూల్చి। తురగంబులనుద్రుంచి
యురగంబులనమించి నెరయువీరాయుధోత్కరమునొంచి। రథికవ్ర
జముద్రెవ్వి యధికవ్రజముగెల్చి యలరుదివ్యాస్త్రముల పేరలుక రాల్చి।
గొడుగులగమిద్రుంచిపడగులగమినొంచితగు దైత్యవీరులధరకడఁ
చి। శూరపద్మునిమంత్రులపేరుజెటిచి। సరివిహారివక్త్రుచెంత
యోజనముదాఁక। ధరణిశూన్యంబుగావించిదరలిచక్ర। మమ
రసైన్యేశ్వరునికరమందునిలచె॥ ఉ॥ అంతట సేదదేరియసురా
రిమహోరివిదారితాత్మసే। నాంతముగాంచిమించిసముదంచితధై
ర్యముక్రౌర్యమొప్పఁగ। ర్భాంతరవాసులౌగుహబలాధిపులేగఁబ
రిభ్రమించుచు౯। గ్రంతులువైచుచు౯ గుహాంకరంబులఁబట్టఁగన
ప్పళించిన౯॥ గీ॥ త్రిపురములమీఁదఁబర్వునత్రినయనాళి। కేకి
వాహ్యయనంగనయ్యాశసుతుని। శయనలినముక్తమైయాదిశ
క్తి। యైనవరశక్తిభువనంబులడలవెడలి ॥ చ ॥ స్ఫుటతరశైలకం
ధరముసొచ్చుమహాశనిపోల్కి విక్రమోద్భటుఁడగుసింహవక్త్రున
నతంబగుజత్రువునాటజీవముల్। గుటికలుగాఁగ గ్రోలిసురకోటి
యుదేతడజేసెశక్తియై। చ్చటననివిభ్రమింప నొకజాముకునంగము
గాడివెల్వడె౯॥ గీ॥ పూర్వగిరిఁబాసివెలువడుపుండరీక। మి
త్రుగతిరక్తశిక్తతమించిగుహుని। శక్తిసురవైరిగాత్రంబుసరవి
వెడల। నీలగిరియననతఁడును నేలగూలె॥ గీ॥ శక్తిజొచ్చియు వె
డలినజాడలందు। గిరిగుహలబాసివెలువడుహరులపగిది। రక్తచ
ర్చితదేహసంరంభమొదవ। వీరవరులెల్లవెలువడివెలిఁగిరపుడు॥
ఉ॥ శూరముఖోరుకాంతియును సూర్యుఁడు గ్రుంకఁదదీయశోక
వి। స్తారముతోనిరుల్ వొడువఁదన్నవబాష్పకణాళితోహిమా।

సారమువర్ణషణ్ముఖయశఃకళికాదులతోడఁజంద్రికల్ । మీరెసు
మారశౌర్యమనమిత్రుఁడు వేగనుదోఁచెనంతటన్ ॥ చ ॥ చెలులు
నుతమ్ములున్ సుతులు సేనలశేషము గాఁగఁగూలుటల్ । కలనికో
కండనిల్చుటలుగన్గొనిశూరుఁడుమూలసైన్యముల్ । వెలువడఁజేసి
వీకనవవీరులరుద్రులఁదాఁకినిల్చినన్ । విలయసముద్రవాకమునవి
క్రమదుర్గమమునూర్తిమీఱుచున్ ॥ సీ॥ బహుముఖాశుగకాండపటలితో
జంగమగిరులవైఖరిఁబేర్చుధరణవడఁక । ఘనచిత్రవిగ్రహాకలనతో
విలయాబ్దవితతివైఖరియార్చవిన్నబడలఁ । ప్రబలహేతికదంబ
పాళితోనురుహలాహలమూర్ఛలను బేర్చి జలధులింక । దుర్నిరీక్షో
ష్ణమహాతుహినతరదవవహ్నులనఁగ నెల్లెడఁ బేర్చెవనులుగాల । లెక్కల
కుమిక్కిలై మేటిరక్కసిగమి । యుక్కుమైనిక్కియొక్కటఁగ్రిక్క
రియుచుఁ । బెక్కుటెక్కులయానంబు లెక్కకారు । కొనుచునమవ
షమబ్బునాదనరిడాసి ॥ మ॥ అతులధ్వానమొనర్చుచుగ్రకగకాం
డాఘాతముల్ బర్వను । స్థిరసింహంబులమీఁదఁదాఁకుమదవత్సం
ఘేభము స్తోమసాంద్యతలోష్ణన్ గణనాథవాహనులఁజయ్యన్ డా
సినన్గాడెనా । దితిజాధీశ్వరఘోరమూలబలముల్ దిక్కుల్ ప్రభుత్
ప్రోయఁగన్ ॥ ఉ ॥ వారికినీడఁబోకగణవల్లభులుగ్రతనుద్యుసాయ
కాసారము శైలపాళిఘనజాతము సుద్యుశరాళినాగపిస్ఫారక
తోరగాత్రములపైదొరగన్ ధృతిమాలియందఱున్ । బారిరిశక్తిభృ
ద్రథము పక్కఁగురక్కసులంటితాఁకఁగన్ ॥ చ ॥ అసురకులంబు పో
టుస్వబలావలి కొందలపాటుదేవతా । విసరముగన్నచేటుసు
రభిత్పతియార్చెడినీటుజూచియా । శసుతుఁడు లేఁత నవ్వుముఖ
సారస పాళినలంకరింపహా । స్తసరసిజంబులందు ఘనచాపము
లెత్తివిలాసవైఖరిన్ ॥ చ ॥ క్రమమునదివ్యబాణవిసరంబులఁగొం
డలనుగ్రచక్రవి । క్రమమునఁగొండలన్ దునిమి కాలవిళంబనమొం
చి మోహనా । స్త్రముధృతముష్టిఁబూనిఘనతన్ నిగుడించినభూరిభీ
కరా । ర్యమరుచిదేరి కోటితెగలైయలతూపనురాళిబర్వినన్ ॥ ఉ॥
ఖండారుషణ్ముఖాకృతులనొప్పఁగఁ గన్పడిపోరిపోరిడా । రొండొరు

చేతఁగూలిరతు లోగ్రత నేమనవచ్చునప్పుడు । ద్దండతప్రమోసేనాని
యుతదానవకోటులుగూలనొక్క మా । అండము ప్రమోయప్రమో
యుశంజాయుధఘంటముహుర్తయుగ్మముల్ ॥ ఉ ॥ నమ్మినసైన్య
కోటియుటునాశము బొందుటజూచియూరిలో । కొమ్ములుధక్క
రాక్షసుఁడు కుయ్యిడలేమియెటెంగిమించుధై । ర్యమ్ముడిపోవకన్
దలఁచి నంతటమాయయరుఁగుదేరదే । క్రిమ్మరి తేఁడుతల్లిక్కినిదె
ల్పెసమస్తబలాస్తనాశమున్ ॥ చ ॥ తెలిపినయవ్వఘాటియతధీ
రతమోసుతపాతకంబులి । ట్లలవడఁజేసె ధర్మమదియగ్నినదిన్
కచసేతునొనికన్ । దలఁపయిబారువేశియమితంబయి మూరెడు
బారెడైననే । మిలఘుతబొందకన్ గుహుని మేకొనిబోరుచుటం
చుఁదెల్పుచున్ ॥ మ ॥ మనసంకల్పితఖేటయానమునన ష్టాయా
శ్యదానెక్కివిస్మయనీయామితవేగవృత్తిజనితత్సంజీవనీశైలకూ।
టయుగంబొక్కటఁదెచ్చియుద్ధధరణిన్ గంజాస్త్రబింబంబుల । ట్లి
యువెల్గొందెడివానినుంచి కవిదత్తామేయ మంత్రంబునన్ ॥ ఉ ॥
ఘోరసుషుప్తిబాసినటుగూలిన సేనయుసింహవక్త్రుడున్ । గ్రూ
రులుఘానుకోపకముఖుల్ వడిలేచివిధూతయానవి । స్త్రారముమున్న
లేన్ దగను దగ్రతనెక్కి మహాట్టహాసవీ । రారవముల్ చెలంగఁ
గశివాత్మజుఁదాఁకఁగబ్రాహునయ్యెడన్ ॥ చ ॥ ఇదియసురారిమా
యయని యేఁగెడివారలుఁగావ్యవిక్కయి । ట్లొనవెనటంచునగడు
మననొడెడి వారునిశాటమాతయిం । పొడవఁగనోషధీవితతినూ
ల్కొనిలేపెనటంచుబాఱువా । రదరెడువారునైరియ మరావళి
రుద్రములు వీరనాథులున్ ॥ గీ ॥ కాండకాండంబులొక మాత్ర
గడడంగఁ । జేయఁగానోపుగుహు ప్రమోలమాయవన్న । ను
త్క్రియావళిసంశిద్ధినొందజాల । వనిదలంపకవిభ్రాంతి నడలెజగ
ము ॥ ఉ ॥ చిత్రముకాంతయీగతి సజీవతమీరనసర్వసేనలన్ ।
గోత్రపనందనుండుగయికొకని జానసఘాలసంలస । న్నేత్రమె
కింతవిప్పనెడనీరయియట్టులుగూడ లేక తచ్ఛాత్రవసేనమాసెనల
శైలశిఖాళియుగాలెమాయతోన్ ॥ గీ ॥ అంబుజాననవినుమశక్య

ముగగనము! తనకడల నెఱుఁగనిగతి తా నెఱుఁగఁడు! విభుఁడనన భ
ప్రసవమొందు వెలయదనినఁ! గలదె సర్వజ్ఞతకు హానిదలంచి చూడ॥
ఉ॥ అంతటనంతయుం గనిసు రారిశిరోమణిపుష్పకంబుపై!
నంతకవృత్తి నెక్కి యసురావళిచూపులు నేర్చుచుం దిశా! భ్యంత
రముల్ ప్రతుల్ మొరయ నార్చుచుఁ బైఁబడ లేతనవ్వుతోఁ! గం
తువిదారి నంమనుఁడు కాండ మొగిన్ నడిపించె నయ్యెడన్॥

## శూరపద్మాసురకుమారయుద్ధము॥

క॥ కరిహరిగిరిహరిధారా!ధరముం హరివిశదలీలఁ దాఁకిన
గతిదా! కిరిదనుజషణ్ముఖులనీ! రరుహాభవాండములు వడఁక రాజీ
వాక్షీ! వ॥ ఇవ్విధంబున మందాకినీనందన మాయానందనుల
మందస్థైర్యగాంభీర్య వీర్యంబు లెసంగఁ బ్రళయఘనాఘనంబుల
పగదియు దారసర్వతోముఖకాండంబుల గురిసి దుర్దినంబు లాపా
దించుచుఁ బ్రచండఘనాఘనంబుల కరణిఁ గరమండలాగ్ర పాం
డిత్యంబులఁ జూపి - ధరణి నడలింపుచుఁ బ్రచురఘనాఘన వైఖరి -
శతకోటిసాధనవిశేషప్రయోగంబుల సవిధధరాధరంబుల నురు
మాడుచు - నుద్దండపంచాస్యయుగళవిభవంబున - నంబకజ్వా
లాకలాపంబుల నభగపురంబుల నీరుజేయుచు - నుదాత్తపంచా
ననమిథునంబుల పగది - భీకరారావంబుల దిక్కరుల యుక్క-స్రు
క్క-పఱుచుచుఁ బోరు వెడషణ్ముఖుండు ఖండకౌశలంబున దనుజ
ధన్యతూణీరకేతన ఛత్రచామరంబులందు నిమిమొ నిమిషత్రాఁపు
లుగంబునఁ దిరంబున గ్రుచ్చిన నొచ్చియ సొప్పలదిండిసిప్పలుప్పతిల్లు
చూపులం గూడి మేపుగను తూపుల వేలొక్కయుక్కు వింటజంటిం
చి మ౽టకంటి దంటపయి బెట్టే సిన యట్టియద్దిట్టయుం బకట్టియలప
ట్టిధరవైవిగురివరలన సురకరంబనకరంబులరు శరంబును శరా
సనంబు నుంబడ నేసి శిరంబుల తాళఫలంబుల డులుపు పగిది డులిపి
న నదిమురియుమురియుఁ బోఁడచూప నమ్మనుజాశినమ్మికగలసాధన
మ్ముల మేటియగు దండంబు భుజాదండంబునం బూనిసుమారుపైపైవ
నదయాశక్తిసుతుశక్తిచే మొక్కబడుడు రక్కసుండు శూలి మొ

సంగిశూలంబు కేలంబట్టిగొట్టిన యద్దిట్టనెట్టనం బట్టి కొనుచు మిట్టిపడితొట్టగిలక నాజగజట్టిజగత్సంహారక బలానతంబగుపాశుపతంబుఁ బ్రయోగింపవేగంపు టుగువడినది యాఁగరంబునచేకొని యగ్నిభవుండార్చినఁ జెచ్చిన రోషావేశంబునదనుజుండు సాధనవైకల్యంబునలపోసి వాసి చెడకమాయాబలంబున చలంబునమింటి కెగసియదృశ్యుండై యరుణాకారంబునఁ బొడచూపుచుఁ బాషాణాగ్న్యశని నాగవృశ్చికసింహవ్యాఘ్రవర్గంబులుగురియ వియచ్చరసేనానాథుండు దారమారుతబాణంబునవారించె శూరుండుగండుమెయినరూపుండైకొండలతండంబులఁబెకలించిరువ్విన నవ్వుచునవ్వీరశిరోవతంసంబు దంభోళిసౌరంభంబుల-రూపుమాపె-నరాశిమృతసైన్యంబుల మరియు సజీవంబులగావించి నటులమాయవన్నిన-కుమారుఁడు-చూపులనేదహించె-వెండియుఖలుండు గండభేరుండచక్రవాళాది నానారూపంబులఁ బొడచూపిపోరినగాంగేయుండు చిఱునవ్వులనివారించె నిట్లు-నలయక-సొలయక-ద్వాదశాహోరాత్రంబులు పోరునప్పోరు-ధర్మకౌశలసాంద్రంబయ్యు పుణ్యజనభీకరంబై-సుగుణధ్వనివిశేషంబయ్యు కావ్యకళాదూరంబై మార్గణప్రచురంబయ్యు దానికాండభీషణంబై-యుదంకలసితంబయ్యు శూరపక్ష్మభయదావహంబై యొసంగెనా సమయంబున ||

మ || ఘటసర్వంబునుశక్తిమైనొడసి వీకన్ బట్టుపక్షీడ్సము | ఘటసత్వంబుబయల్ పడంగనపుడా ఫాలాక్షపుత్రుండువి | స్ఫుటలాస్యస్థితిదేలువాజిడిగియా శూరస్ఫుగత్క్రోశము | త్రుటశక్తిన్ పడఁబట్టియార్చ్ సురలోకంబుబ్బ మైనార్వంగన్ || సీ || తనవీక్షణార్చులతపనాశుశుక్షణి క్షణదేశకోటులుసంభవింపఁ | దనహాసకళికలవనజాక్షవాణీశవాస వశతములుద్భవముఁబొందఁ | దనవాక్చయంబులదండశూలారిశంబకదంబ భూరులేపట్లఁ బొడమఁ | దనరోమవితతులవన జజాండాకాశమేరు సహస్రముల్ మెలపుమాప | దానవాధమనీరూపతతులగంటి | నాదురూపంబు

గనుమనినాగవరము। చరణములరాచుగరుడునిచందమొందె। శూ
రపద్మాసురునిద్రొక్కిత్రొక్కఁబట్టె॥ మ॥ కరశక్తిన్ హరనందనుం
డు విశదోగ్రస్ఫూర్తిమైలోకభీ। కరతేజోమయుఁడై వెలంగిబలు
వీఁకన్ శూరపద్మారిపై। నిరుపాయుల్ వడఁజొచ్చినంతగనన
య్యోర్వన్ శూరపద్మారిసుం। దరమూర్తుల్ గుహుకేత నాశ్వములు
సుందన్ జెచ్చి దైత్యేంద్రుఁడున్ ॥ గీ ॥ ఇటులగుహశక్తితనమెయి
నెలమి రెండు। వాయలుగఁ జాపఁగుక్కుటాబ్జసఖమూర్తు। లగది
విజ్ఞానము ద్రలింపొందసిలిచి। నిర్జరారాతియతని వర్ణించఁదొడఁ
గె॥ హుశేనిరాగచరణద్వయవర్ణగర్భిత సీసమాలిక॥ నాకలో
కానందనాహరనందననాథ యాశ్రితచందనాపరాకు। శక్తిసం
భృతనతజనపోషణాసారసుగుణామేయభూషణపరాకు। సచ్చి
దానందవిశాలవిభీషణ సత్కృపాపాంగవిశదపరాకు। భాభూ
షణారామహేశ్వరవిభవా విమలోత్తమకారణహాపరాకు। ని
ర్మలగాత్రచిన్నత్రసన్మిత్రభుజంగవలరిపుకంజరపరాకు। భూతేశ
మానితబోధకశూరవిదారణకారణధనపరాకు। రవిచారణకృపాం
కురాస్మరకోటిమూర్తిసమధికకీర్తిరంపరాకు। సారసర్వామరసం
రక్షకవిప్రాణదాయక భువనానుదాపరాకు। భవ్యరూపయాశ్రి
తవ్రజపంజరామ। హేమమహాకనకచేలఘనావిలోల। వినుతశీ
లసముజ్జ్వలయనినుతించు। భాగ్యమును నాకొసంగు దేవబహుప
రాకు॥ ఆనందభైరవిరాగకీర్తనాగర్భితసీసము॥ రాజితసత్ప్రాక
గాజవారాసురరాజబ్రహ్మాండేశ్వరాకుమార। రాజధరాస్త్రా
బ్జరథరాజరాజ ముఖ్యనుతతేజావిజితాజదేవ। భూజాలసద్భూ
జతేజకారణవిగ్రహాజితవారణ దానవజయహర। ణతలార్కభ
వవారణగుహపూరణీరుజాపహ నిస్సరణమహామహావిచార।
దూరమారశతాకారవీరసార। నిత్యయనినిన్నుబొగడు నిర్నిద్ర
వుతుల। కచ్యుతత్వప్రజాపతిత్వాదిపదవు। లమలదాస్యతగానె
న్ననగుసతంబు॥ మ॥ అనివర్ణించికుమారనీస్మరణమొక్కైనన్ శు
భంబిచ్చునం। టనిజంబౌనినుమారిసోరియును వేడ్కన్ దేవతాపా

ళిక। బ్బని సేవార్థులసత్స్వరూపములసంపాదించితిఁగానకే।
తనవాహస్థితిఁ బూనియెప్పుడును జెంతన్ నిల్వఁగాఁ జేయవే॥
క॥ అనుచు వేడెడు కుక్కుటమును మయూరము। మునుపడగగాఁ
గహరిగాఁగఘనతనిలిపి। వహ్నిశక్రులమును బలెవరలఁ జేసి। సురు
లుజేజేయనుచు నార్వసొంపుగాంచి ॥ సీ॥ నవవీరరుద్రసంతానం
బులోకవంక భక్తిమీరఁగ బరాబరులొనర్ప। విష్ణువాగ్వర ముఖ్యవి
బుధాళి యొకచాయఘన మోదము హితులై వినుతి సేయ। రంభాతి
లోత్తమాప్రముఖులొక్కకురంగటను విలాసాప్తిన ర్తన మొనర్ప।
నారదాగస్త్యాదినాకర్షి వల్లభుల్ వేదోక్తరవములవినుతిసల్ప।సక
లవిధవాద్యరవములు సందడింప। గరుడగంధర్వకిన్నరుల్ విరులు
గురియ। రతిరమాముఖమహిళలారతులుద్రిప్ప। సేసజల్లశాం
తినిప్రవేశించెగుహుఁడు ॥ ఉ॥ నాకులబాధతోడభువనంబులబా
ధలువాపి దేవతా। నీకముగొల్వశాంతిపురనిర్మల గేహము జేరి
యున్నవా। డాకరుణాకరుండిఁక నవాంబురుహాంబకవిష్ణుము
ఖ్యులన్। దేకువమీఁగ గూడిచను దెంచునుస్వర్గము సేదదేర్పఁగన్॥
క॥ అనిమాయాముని శివజా। తునివిజయము వల్కవినిసతుల్ విస్మ
యవా। ర్ధినిదేలియాడి పొగడిరి। మునికులచంద్రుఁడతఁడంతము
డితమనమరియున్ ॥ సీ॥ అసహాయధుండనియనుటమాత్రమె కాని
యుగ్రాంబకాగ్నిచేనుర్విఁగూలె। నఖిలజగజ్జయుండనుటమాత్ర
మె కానిపాంధులపైఁదక్కఁబాఱడమ్ము। లసహాయశూరుఁడంచ
నుటమాత్రమె కానియిలమహాబలుఁడు లేకేగుటరిది। యతిరుచిరా
కారుఁడనుటమాత్రమె కానితనకంగసంగసుందరము లేదు। మురు
నకనిదూరునెవః సుందరవిభూతు। లెన్నఁగోలోకమాగుహుఁడెల్లి
నేట। వెన్నకుడికెంటఁబుట్టుటపేణిదెలుప।దనరుకన్నియ నేలునం
చనివచింప ॥ వ॥ అనిననమ్మందయానసందియమున మునిపతితోని
ట్లనియె ॥ ఉ॥ ముప్పదిమూడుకోట్ల సురముఖ్యులుమూర్తులులోక
లోకముల్। గుప్పగఁగూడిగొల్వబలకోటులగూడి చెలంగుసక్రం
దనుఁడే। చొప్పనమావధూటి దయఁజూచునునీతఁడమందశేల్లబో

తప్తానేమీవచస్సమితిఁదల్పఁగఁగొంగుపసిండిఁబోలదే ॥ చ ॥ అన
వినిమానీయానెచెలియా నిజమాడితివింతయేలను । తృనిశితమా
జపంబునను శూరకుమారునినిందదెచ్చెదన్ । గనుఁడనిమాయ
పుణ్యజపమ్ముగైకొని కొండొక సేపునిల్చి వే । కనుఁగవవిప్పిదిగ్విత
తిఁగన్గొనిరమ్యఖేలశయఁ చనన్ ॥ మ ॥ ఇదిసంఛింపగఁ గాలమం
చుసురసైన్యేశుండు కాంతారనీ । రదవారంబును పొహాత్పలా
ఘ్రుఁడనసీరంధ్రాపాపల్లీలస । త్పదనంబున్ వడివాసినిల్చె నెదుటన్
సంపూర్ణవీణారవా । స్పదగుంజత్పికబృంద మాగధకపిధ్వానంబు
లింపీనఁగన్ ॥ సీ ॥ తలిరుఁబ్రాయము వాని నెలమూరు నెలమూరు నెరు
మూరుపరచు మైపులుకువాని । వెలుగునవ్వులవానినలినమ్ము నలినము
న్మలినమ్ము సోగపెన్నసులవాని । దళుకుచెక్కులవానిగలయించుగల
యించుగలయించు సుధనించుపలుకువానిఁ । మొలకమీసలవానిగ
ఢుమించునిషుమించుగఢుమించు కాకపక్షములవాని । నీటుగల
వానిరత్నకిరీటకుండ । లోర్మికాకగకటక కేయూరహార । మేఖ
లాంగదనిక గాద్యమితకలాప । చకచకలవానినాజగజ్జానిగాంచి ॥
చ ॥ వినయభయభ్రమంబు లెదఁ బేరగద్దిగన లేచినిల్చి మా । నినులుప
చారముల్ సలిపినిర్మలపీఠము వెట్టమానిశో । భనజయసిద్ధిర స్తను
చుఁ బ్రస్తుతి జేయఁగవచ్చి పీఠికన్ । గనకనగంబు పైవిఘుని కైపడిబో
ల్చెఁగుమారుఁడయ్యెడన్ ॥ చ ॥ అనమితకాంతిసాంద్రుఁడగునా
రుచిశాలిని వేగలీలచేఁ । గనుకమలాంతరంగమునఁగ్రమ్మెరసాంచి
తగాగకందళం । బునుసపక్షండవాసనయుభూరితరోత్కళి కాళి
యంతన । ల్లన నెగడెన్ విరహోగతరళ స్థితులైతమిఁజూపు తెన్మెర
ల్ ॥ సీ ॥ ముఖసత్కళలఁగ్రోలిమును జీవములఁ బోలియును నతిలకా
ర్కనిగనినుతించు । పీతకర్ణాబ్జరసంబు వేనానియళిబోలియును నా
సికా హేమమానునుతించు । దరహాసముల నొంది తనరుకల్వలబో
లియునురు ఛియాతపంబునకనలరు । పీతాంబరచ్ఛవిపై తలంపిడి
శేళ్లబోలిసింహావలగ్నమునకు మెచ్చుఁ । గాంచనకలాపపిస్ఫూర్తి
సంచమించ । నెలమిఖంజనములఁ బోలియొదవువాలి । శంబరారి

యొసల్చి నజకగమండు। విభునినెమ్మేనంబుస్వనవ్వేలదిస్పృష్టి ॥ మ॥
ఘనసారంగవరానిమేషగతి తత్కాంతేక్షణుల్ కాంతయా। వ
వరాశ్వక్రమునం జరించుచును పైపైనీవరాలోకజా। లనవవ్యా
ప్తియొసంగం గ్రమ్మరియు హేలం దోడనే బారుమో। హనచం
చద్గుణధారియైన వలరాయండేవి రాదీయంగన ॥ గీ ॥ కమల
సాయకుం డయ్యోడగడంగితనకు। గలుగుసాధనములననిన్న కలి
యం జూపి। బాలచిత్తంబు నాకళాశాలిమనము। సతులపారదగ
తిం జొక్కొనాక్షణమున ॥ క ॥ చంచలనేత్రాంచలములం। జం
చద్గానాంతోసులనుసారె కొసగనున। కాంచనగాత్రినిగుహునీ।
క్షించివలికె శౌరదాఖ్యచిన్మయఘనశక్తి ॥ సీ ॥ అఖిలకాండజయ
విహారంబు గాంచునీపడగసత్వదశప్రథమమూర్తి। రెండోందుజే
యునీచండాస్త్రశక్తికాదిమసాక్షితారకాధివరమౌళి। జగమెన్న
మించునీశిఖగసైన్యపాళికినాటపట్టులు సువర్ణాద్రివనులు। భువ
నమానసవాసభూతిచేనలరునీయొప్పువియోగులకెన్నవరిది। గుహ
ప్రబోధితుం జేయునీపరమవిద్య। లతిజగన్మోహనస్ఫూర్తి నలరు
చుండు। నసదృశాకారసుకుమారయసమవిశిఖ। వారసకలజగ
జ్జయసారవీర ॥ సీ ॥ నేడుగామారాకనేరిగాంచె నిరాకవరకళ
ల్ జిలుకసర్వజ్ఞమౌళి। నేడుగామాపద్మినిచెలంగెనీ దర్శనముత
మంబును బాపవిమలమిత్ర। నేడుగామాకాంతనీటొందెనీమా
పుసుమహితత్వము నింపసురభివరిత। నేడుగామానారినెగడెనీ
సంగతి యతులజీవతగూర్పనచలధర్మ। సుగుణరత్నాకరునినిన్ను
జూచి గెలువ। గాంగలిగెంగానన మృతత్వగరిమ వెలసె। మాకునె
ల్లరకెంకమామహిళ నెన్న। మావశంబాసురాంతకగ్రావశంబ॥
చ॥ అమలకటాక్షమర్ధితసిశాటకులేంద్రకుమారచంద్రమే। ము
మహాభవత్పదాంబుజము ప్రాజన సేమనువారె గాకనిత్యముకడ
వారుగాముభవదంచిత శౌర్య మహాత్త్వవర్ణనం। బుమలయదెల్పి
యీభువనమోహినిదేల్తుము బాల్యమాదిగన్ ॥ చ ॥ అనహరుప
ట్టివలుక వెలియాయున తాతనా మంత్రసిద్ధుడిమ్మునిగొనియాడన

డందములు సమాజ్జ్వలరూపకలాపయై వధూ । మణికిని మాకు దర్శన
రమణ గలిగించె నితండు మాకు వ । ల్కనుము నిమాత్రము జేయరయ
గా పరమాప్తుడు గాక యెప్పుడున్ ॥ సీ ॥ అని షణ్ముఖుండు తన్నుని
నుతింప నమ్మానివనిత నెమ్మొము గన్గొనుచు గొమ్మ । మహిమ నికాం
తాలోకమణికి గాంగేయసంగతి దుర్లభం బయ్యెంక నామదీశు । గొలు
వంబోవ లెను ఖండబలవన్మీక నివలికివారలవినతులకు నలరి । ముసిము
సినగవులొప్పంగ దన్ను నుపమణ్ముఖుని పీడ్కొని చనిముని విశే
ష । వేష మొకచో నెడలి పూర్వ వేషమూని । పతిసమున్నేషపరుండన
వద్య యాజ । గత్పతిని గాంచి సంభ్రమకలనవినయ । మనసపతి
సరముననిల్చు నవసరమున ॥ మ ॥ సతులాస్కందహితోక్తివక్రగ
తులన్ జర్చించుచున్ దొంటిబల్ । యతిగా నెంచు మనుంనవాలస
రుచిమందానూను భావంపుపా । ల్పుతగన్ జూచుచు మేనుపైదిరు
గుచున్ బూబోణినీక్షించు మేల్ । రతిపిశ్వేశు డళిక మానినిటు జే
రన్ బంచె నంచెన్నగన్ ॥ చ ॥ వనిత యొకర్తు మేలమున భామినులా
రకుమారు రాక చే । ననువసునీసు గోత్రజము ఖ్యాతి విలాసము లెంత
మించెంగ । న్గొనుండనసిగ్గు చే మొగము గొబ్బున వాంచికుచాగ్రహారత
ర । త్నని చయబింబితుండయిన నాయకుంగన్నియ జూచుచుండ
గన్ ॥ ఉ ॥ మానినికి లెటంగిను సమచ్ఛిక నచ్చెలి వెండియున్ బ
హో । జాననలారయీవనిత యందపుసేరెదషణ్ముఖాశ్మసం । తా
నము మించెంగాంతకరుణారస యుక్తకటాక్షయోగమున్ । బా
లైనటన్న బయ్యెదనుమూసి వధూమణి యూరకుండినన్ ॥ చ ॥ అ
లచెలి వెండియున్ వనితలాగజగద్విభుడంచు నెన్నకే । కలికికుమార
దేవుగుడి కాంతకిరీటమణీవితానమున్ । గలిమిని జేరియెయ్యెడ నె
కాంతుని మేల్ తలయెక్క గోలయే । లలితప్రగల్భ గాక యనలత్త
కహొత్తుకనుల్ వహింపగన్ ॥ చ ॥ పొలతుక మించుబొమ్మ గతిబో
ల్చిలసద్రుచి చూపు సొల్పుమై । నలకలకందులన్ దెగడి నాంసకము
ల్ మలగంగ నెమ్మియిం । పులనటనంబెసంగ జనుపొల్చు సుమధ్యమ
హోంబరార్చియున్ । వెలయంగ నేగె రాయమగణింపకు నప్రతిసేక

లోనికిన్ ॥ఉ॥ ఇందుకలాపనందనుఁడు నీగతి చిల్కలకుల్కి డాగమా।
నందనకంజసాయకగణప్రతిబాధితచిత్తుఁడై కళల్। జిందఁ దదీయ
మోహఘన సింధువునందు మునింగినట్లు తా। నందియదృశ్యుఁడై
యూప వనాంతరధామము జేరియవ్వలన్ ॥ సీ ॥ కుంభహస్తస్ఫూ
ర్తి కోమలివతోరు హేమాబ్జసౌరము చూపు సౌరదంతి। యత
మధ్వజాలోకనావాప్తి నయ్యైంద్ర సేనఁ దల్పగఁ జేయుసీప్సయు సే
న। చిత్రపింఛవిభూతి చెలువసందెడి వెంట్రు కలనుగప్తికి దెచ్చెవె
లుఁగు కేకి। మించుజోతులతోడ మెలతరత్నాకల్ప కాననస్థితిజూ
పు నాతురలును। గరిమము న్నెగగాంబరాంబరులొనర్పఁ। గాంధ
మైమీర సురవధూగణము ద్రిప్ప। నంతకంతకుతమిమదినగ్గలింప।
ధనదసఖసూతి శాంతిపత్తనము జేరె ॥ ఉ ॥ అంతమగుండు కాంత
కుసుమాంచిత దేహము కార్ముకంబుగా। సంతతవిభ్రమిద్భ్రమర
సన్నిభవేణి చెలంగునారిగా। కాంతకటాక్షపుంజములు కంజన
వోత్పలసాయకాళిగా। నెంతయుబూనిశక్తిధురు నేయుదొడం
గెనుముందుదోచుచున్ ॥ సీ ॥ నవసుమనోమార్గణవశుఁడై యొ
సఁగెను తమయెల్లతత్సమాగమమునపుడె। ఖగవాక్యవారసం
గతివినియొసగెఁ గాంచనకూటధృతితత్ప్రచారమునకుఁ। బావ
నాగతివైభవమునకై వైచె నంగమును తత్స్వపదతల్పమును జేర। న
రివర్గబహువిహారాప్తిగుందించెను నింద్రసేనాసక్తియింపుమీర। న
నుచునతనుఁడుప్రీతుఁడై యతనికొసఁగె। గణ్యసాహిత్యచింతసం
కల్పసిద్ధి। సమపరిశ్రమసాత్త్వికాంచద్గుణాప్తి। భావరసశరసు
మనోధర్మపటిమదెలిపి ॥ చ ॥ వరహరినందనార్చితన వాంబు
రుహాంబులు గొమ్ము సేనకున్। వరనవమల్లికల్ గొనుము భవ్యద
యామతినన్నరాగభా। సురుఁడయి యొక్కమాఱయినఁ జూచు
నుగాకనునెట్టికానుకల్। సురలురుభక్తిఁదెచ్చినను జూడఁడుప
క్షి ఘుఁడొట్టివింతయో ॥ సీ ॥ భద్రసంభారోహపత్రి కెంతకొండ
య్యో భద్రకుంభములైనభామచనులు। హరిజాతవినుతాంఘ్రిఘన
కిసలజకెంతగ గనమయ్యెహారియైనకాంతకౌను। జితవిషధరసూ

హాజికి నెంత ఘనమయ్యె విషధరస్థితిగను వెలదికుచులు । కనకాద్రి జేసున్న ఘనునకు నెంత బంగారయ్యె కనక మాకలికి మేను । చిత్ర మనియాంతరంగిక మిత్రుఁడైన । మరుఁడు గువడించి యాసురవంసు పుత్రి । జలజనేత్రి మధుర వాణి జలద వేణి । మృదులపాణి తదాధీన హృదయ జేసె ॥ క ॥ అని సూతుఁడు వలికిన విని । వినయంబున శౌనకాది విశదాత్ములునిం । పున నవ్వలి కథ దెలుపుము । ఘనమధురామృతములొలుకఁ గానని వేడ్కన్ ॥

## ఆశ్వాసాంత సంబోధన.

మ ॥ ప్రతిశూన్యప్రమదాపదాంగుళినఖోత్పన్నాబ్జపాసేద్ధశా । కృతిఓంకారవిలాసపంజరల సత్కీర్తి గప్రభావాంగనా । పతివేధోండకులాణుజాలక కళాభాగ్రోమకూపాంచితా । కృతిసచ్ఛిన్మయనిత్యనిర్మలమతీ శ్రీమద్విలాసావృతీ ॥ క ॥ శూలీవిధుమాలీసుక । పాలీవిష్ణ్వాదిదేవపాలీవిలస । త్పాలీసుకృపాలీఫణి । పాలీవిలత్కలాపపాలీశాలీ ॥ పంచచామరం ॥ అనంతశాంత కాంత కాంత కాంత కావిలాసభా । గనంత కాంతివంత కాంత కాంత కాంతవిస్ఫుర । ఘనాండకాండకాండ కాండజాశ్వసోయకా । యనేకలోకలోక శ్రీకరాకశోకవారణా ॥

## గద్య.

ఇది శ్రీమత్కుమారపదారవిందవందనానందసందీపితసకలభోగపురందర ధైర్యవిజితమందర-నాగాయఃణధరాకళత్రపుత్ర-యార్యమౌక్తికశతపత్రనేత్రపాత్ర - త్యాగభోగవిరాజమానత్యాగరాయాభోజాభిధానప్రణీతంబైన-సుబ్రహ్మణ్యవిజయాభిఖ్యవిద్వత్కర్ణామృతంబనుమహాకావ్యంబునందుఁ

జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# సుబ్రహ్మణ్యవిజయము.

## విద్వత్కర్ణామృతము.

### పంచమాశ్వాసము.

శ్రీగగనధునీశేఖర । శోభితమకుట కనదిలానాథశరా । యోగిజనవంద్యశుభగుణ । సాగరసద్భక్తిపరవశావిశ్వేశా॥

గీ ॥ అవధరింపుముశౌనకాద్యఖిలమునులఁ । గాంచిసూతుం డువచియించుక్రమలీల । సురకులేశ్వరుపుత్రినీరరుహగాత్రి । నాగినలంచఁగమన్మథుఁడురువశించె ॥ చ ॥ సమధిక మోహభాగత నుశాస్త్రనిరూఢులెఱింగిసత్పద । భ్రమణాలమీరిమోహనవిపాక గతుల్ పచరించిమేటిశ । య్యామరిగిప్రత్యలంకరణహారివిభావర సాభిరూఢిమిం । చిమహిళసాహితీగరిమచింతన జేయఁదొడంగె నయ్యెడన్ ॥ సీ ॥ ఉచితక్రియలనాస్థనానరించుచెలిఁజేరిమార్గప్ర సిద్ధాళిగుణముదెల్పి । నిజధర్మకౌశలనిరతిమించఁగఁజేర్చిసకలక శారోపశక్తిఁజూపి । ప్రస్ఫురద్గతివరభావనలిడిమించి తరతరం బుగఁగాంతధాతువేర్చి । ధ్యానాతివిషయవర్ణనరసంబునుగట్టి మ హితభావాప్తిభస్మంబొనర్చి । పాయకనిశాంతమంతగాంగేయ మయము । గామరుండనురసవాదిగడఁగిజేయ । మైమఱచికాంత యోరినిమదిగణింప । దెద్దియునుజూడదూడుసౌమిత్రజనదు ॥ చ ॥ చిలుకలకొల్కినేత్రసరసీరుహసంభవబాష్పవారియు । జ్వలనుచ

శ్రీపాళి పైదోరుగు జూడ నతింపఁగ నమ్మ్యోఁ బట్టె పైఁ। దలఁపిడి వేగుకో
డలి వెతల్ గనజాలక వారిఁ గూర్పఁగా। లలిపతివన్నవ త్తరళస్థి
తిఁ దత్పురి కేగు తీరునన్ ॥ చ ॥ నెలకొని మూర్ఛయున్ తమము నిం
డఁగఁ దాపపు టెండ గాయను। జ్వలమతిఁ బాండురంబ నెడి చంద్రి
క నిండగ హారరత్నభా। వళి జిగి మాయ రేఁబవలు వారక దోఁపమి నిం
తి వీక్షణో। త్పలజలజంబులయ్యెడను ఛాయకదారర మోడ్పమై
మునన్ ॥ చ ॥ వరగుణజాల పాశముల బల్విడి నాశల జేర్చియుజ్ఝభీ।
కరతర బాణముల్ నెరపి కార్ముకశక్తులఁ జూపి యేచి శం। బరపుఁడ
వ్వనాటజయవర్ధనిబర్హఁగ నేర్చు సాగెశో। ర్యరుచి జెంగఁగాఁ
భ్రమదయావన రాశిసపత్న సంపదన్ ॥ చ ॥ అలికుల వేణి యిట్లు చ
టులార్తినిదానశరీరినుటికి। త్యలఘువిభూతి ధాటికి మహోళికులాం
డజ పాళి బారికి। జ్వలగ్రహ వేధకున్ మధుప బాధకునోపగజాలకన్
మహా। విలయ విపర్ఛరంబనఁగ వేగుచు నాళికి లోఁగుచాత్మలోన్ ॥ ఉ
పమని పల్కదానహృదయేశుఁడు పుణ్యవశంబు మైననున్। ప్రేమ
నుజూడవచ్చి మన ప్రేయసులొక్కట మేలమాడఁగా। నామదనా
త్రిరూపు నభయంబున నొక్కనిడించి గర్వలీ। లామతిఁ బోయి యాత
నినలంచి తిరింకెట్లు చేరగాంచెదన్ ॥ సీ ॥ ఇంపు మైపిణ వాయింపవహా
యంపు మహర్షి యేమిటికి నెయ్యము నవచ్చె। వచ్చెగాకేమి సద్భ
రు జగన్మోహనాకారుశుంభజ్జయకథలఁ దెలిపెఁ। దెలుపుగాకే
ల కేవలము నాయాజటిపటిమనాథుని ముందు వరలఁ దెచ్చె। దెచ్చె
గాకేల బుద్ధి నివంచనార్థి దర్శితను గాంగేయచ్ఛ జేర్చికొంటిఁ। జే
ర్చికొంటను గాకేల చెలులు మేల। మాడఁ దెరమాటుకరిగి రిప్రా
ణనాథుఁ। డలుక బూని యదృశ్యుండై యగు గశింక। నేమి సే
యుదు పతి జేరు టెటులననుచు ॥ క ॥ ఆళిక నుమొరగిస ద్గుణ। శా
లి సతీమౌళి మదన శరవరబార్వ్హి। పాళీ ఘని కేళీవనిఁ। దాలీలని
రూఢిఁ జొచ్చి తద్రుమవీథిన్ ॥ సీ ॥ జడసిన చిత్తంబు చంద్రమండలి
బోలు చంద్రమండలమున సారెఁ జేర్చు। కలగిన జీవంబు కనుల కాండుఁ
డు జేసు కమల కాండగుణాప్తిఁ గాంచి విషువ। బడలు మేనును మహో

వనిపాంసువులఁ బొల్చు వనిపాంసువులతోడఁ బెనచి ఫుల్లాఢ్య । స్ఫు
టరాగరసములఁ బుండరీకాంకోరు పుండరీకములను బోరిఁగనొనఁ
గఁ । బల్లవపుటార్చఁ జేబూను పద్మనాళ । సూత్రములఁ జేఁడు పుష్పిత
గాత్రకుంజ । శాఖల విదుర్చు కోలనులఁ జరగఁ జూచు । బాలవిరహాంబు
చేఁదనఁ బ్రతుకుదోసి ॥ ఉ ॥ అంతట కామినుల్ చెలిగృహాంగణసీమను
గానకక్కటా । కాంత యెటేఁగి తేయనుచు గ్రక్కున నెల్లెడలందుఁ జూ
చుచున్ । గంతుదురంతకుంత పరికంపితమానసయై వనిన్ నితాం । తాం
తత నొంటినుండు చెలియున్ గని ఖేదము మోడమూనఁగన్ ॥ చ ॥ కట
కటవమ్ములన్ నిమిషకాలము వాయని నీవు నొంటిసి । చటికె బువ
చ్చి తేయిచట జల్లినపుష్పాడిధూళియందుఁ నీ । వెటులఁ జరించి తెల్లుత
రియించితివీబలు తేనెవాకలిం । దెటుసుఖివైతివీశిఖులు నీబలుకో
ములలండనుండఁగన్ ॥ సీ ॥ మహీనగాగ్రము లెక్కి నుడకలకంఠర
వములు పాంథుల నెల్లభయము పెట్ట । సమదరసములాని సారంగ
సంఘము లేచి వియోగుల నెల్లనలఁచ । సురభిప్రభుత్త్విభీకర పుండరీ
కములకీలాలధారలఁ దేలియాడ । నగముకోటుల నుండి హరివితా
నంబులు సొచ్చి భీరుకులంబు స్రుక్కఁ జేయ । నమగునిటకొంటి రా
నా నెయంబుజాక్షి । మదనకాహళగుణరవము హితబాణ । ఘోట
కానీక ధాటికిఁ గుందుచుండి । గట్టుపగతునిసుతవునికంబు గాదె ॥
చ ॥ మలయుచు నంధకప్రియకుమారుఁడు నాతని మేనమామయు ।
జ్జ్వలకజమూర్తియున్ ద్రుపద జచ్చదలూడ్చిన పాంసులుండు నిం ।
దోలయఁగ విప్రయోగివధయున్ గురుతల్పగతల్ మధువ్రతం । బు
లును సువర్ణచౌర్యతలుఁ బూను దురిద్యోడకిందు వత్తురే ॥ చ ॥ అనిబ
హువర్ణపుష్పనిచయాన్నము పైఁగనకప్రదీపిక । ల్నినిచి వధూటికిన్
దిగిచి లేమలు దారశరీరిమూఁకచే । కొనగనువైచి బల్తమినిగొంకు
టమాన్పవనీపిలాసవ । ర్తనమునఁ బ్రొద్దుబుచ్చు వనితన్ దయ దేల్చు
చుఁబల్కిరయ్యెడన్ ॥ సీ ॥ రమ్యచంద్రకశేఖరస్ఫూర్తిఁ గనిఘనా
ఘనపోషగను నీలకంఠలీల । సురసాలవనఫలస్ఫురణ భోగించి ఖ
గార్చితశ్రీగను హరివిభూతి । కమలాధివాసయోగమున మించు

ముభవ నావనస్థితిఘనుమహంసవృత్తి । సురభిసమాశ్రయగరిమస
జానుధు ప్రాప్తిచెల్వందుదివ్యాళిచర్య । లలితబాంధవసంపద
వెలయఁజేరి । నినుమనుచుఁగాక నెవ్వఁజేయనుదలంచు । వింతనిష్క
వమునిరూపించి హితవిలాస । సాంద్రభీవనిగనుమని సతులువిలు
వ ॥ సీ ॥ రమణీయకర్చుగర్భాగ్రాహాభసుచసుంభ భారసంభృత్కార
పద్మ యగుచు । శ్రమజీవనవ్యక్తసహజసాంకవముదామోదమేదు
రలసన్మూర్తియగుచు । నిత్యనిర్ఝరదీర్ఘనిశ్వాసతీక్ష్ణపవన ఘ్రా
ణనాసికాకనకయగుచు । నుజ్జ్వలదతనుతాపజ్వాలికోష్ణిమావ
రణసమంచితావయవయగుచు । సారసదళాక్షియయ్యెడమారకీ
ర । భసలకిసలసముద్ఘటభయాదవిరహ । తాపసాహాయ్యమొ
ప్పఁగాఁదలఁకులుడిగి । వెడలెనభిరామతరవనీవీథులకును ॥ క ॥ ల
లనామణులపుడు వవన । తలనానాసూనసంపదలనింపొదలన్ ।
కలకంఠికిఁదెలిపిరత । త్కలకంఠరవంబెసంగఁగామోదమునన్ ॥
మ ॥ సరసంబౌసుమనోమహత్వగరిమల్ సంజీవనీవల్లరుల్ ।
సురభిస్ఫూర్తులునవ్వనంబుననునెచ్చో వాగ్రముల్ మూసలా । క
రణశ్రీలశరీరులున్ విశదగోగాంభీర్యతల్ పుట్టుగు । ద్ధురతన్ గ
న్గొనఁజేయుదీని చెలువున్ లోలాక్షివీక్షింపుమా ॥ సీ ॥ కలికినీ
పదలక్ష్మి కలికియాకులపాటుబహుచిప్పిల్లను బికప్రతతికొసంగి । చె
లువనీనును మేను గెలువ సూనస్థితిఁగను పుష్పముల తేఁట్లకున నొ
సంగి । బాలనీకెమ్మోవి మేలుఫలప్రాప్తికందుఫలములజిల్కల కొ
సంగి । బోటినీమైతావిపోటిగంధములైన పటీమళంబులగాలికెర
యొసంగి । విప్రవరవాక్యములతోడవినుతిఁజేయు । చునువనీలక్ష్మి ని
న్నునింపెనయుసీయ । గరిమసార్థకతమునుగాఁగనుగొనంగ । న
లరిబిలిచెడిచూడుబింబాధరోష్ఠి ॥ మ ॥ శతపత్త్రాంబకరాజహాళి
కిని గంజాతాక్షిపాంథప్రజా । స్థితిహృద్వేగకలీలబోయి తెలుపన్
జిచ్ఛక్తిమైమాధవ । స్తుతసచ్ఛారణుఁడుంచుకొన్నవర విద్యుద్యం
త్రసందేశినీ । స్థితికిన్ దీవియలివ్వతీవెలుతరుల్ శ్రీస్తంభమున్ గా
డఁగెన్ ॥ చ ॥ భువనరుహాక్షియీసువనపుష్కరసీమనసందమొం

వవిమలారుణారుణలలామములుజ్జ్వలదీప్తిఁ గప్పెనొ । డసియొప్పెడుఁ భువన. భూభవపాళికి గోసుదర్శనో । త్సవములనిచ్చుచుఁ దరణి సారెభ్రమించుటవేడ్కఁజూచితే ॥ చ ॥ అనుపమగాత్రిదాడిమకు జావృతలోహశలాకమార్గము ॥ ఘన సుడిగాలియుఁ మహిత ధూమరథంబురకంబుచేఁజనఁ । మను జపజాలముఁ ఫలపు నారుబుప్లవపాళి యందులోఁ । గనులకు మించులోయనఁగఁ గన్పడిమాటగులీలఁజూచితే ॥ చ ॥ అతులిత పుష్పగుచ్ఛము మహోపవసింధువునందు దేలుచుఁ । సతతము భృంగధాముము లెసంగగసారసమీరగసత్వరా । గతిప్రతితీరపాళికిరకస్థితి జేయుచునాడెడిఁ సుధా । మతరణిబోలె కేసరస మండిత మానవపాళితో సతీ ॥ చ ॥ ఇనకరఘోరతాపము సహించియు పాంథులనీడమున్చుచుఁ । బనివడి సారెమూలఫల పాళిసతంబు సువిప్రపాళికిం । పొనరఁగనిచ్చుచుఁ బనస లొప్పగగంటె వెలజ్జ వేల్పుగో । గుణకనకాగమం । ఘనడె నాతిమరందఘురాను బింబతఁ ॥ సీ ॥ కలకంఠములునీదుకలకంఠగరిమకు నేనగాదను చుఁ దెల్పెడినిబ్రియాళు । వలచిల్కగమి నీవగలపల్కులకుసాటి గాదంచు దెల్పెడికన్గొనగ । మదభృంగములునీలసదపాంగములఁబోలవని వేడ్కమైదెల్పుడినదిలకము । పల్లవంబులు నీదుపదములసరి రావటంచు నుడెలిపెడినయ్యశోక । మునిగదాపాగతల్లక్రింద్రైతపించు । మానిమైయొప్పదుకనకేచ్ఛమానితరుసు । బొందునాకులపాటలహాపుండరీక । లపనపికశుకమధుపప్లవచయంబు ॥ సీ ॥ చెలిపుండరీకంబుచేపట్టలేవని మిన్నసశోకంబుదన్నుమవల । వనితపున్నాగంబుగనినగలేవనియుబ్బు కేసరముపైనుమియుమింతి । కామినిన్యతుతిల్లకముగన లేవని వదరుప్రియాళుపైఁ బాహుమింతి । సతియింద్రసుకసనావ్యాపింప లేవని దెగడు గోగడఁగంగదిట్టుమస్సు । ముదితయలతావిగ్రోవినియొదకుజేర్చ । వనియొడియు కాంచనమునకువనితమొగము । జూపియడపుమునిన్నవిశుకకలార । వాపిపైచిన్నగాఁబల్కుటాలకించి ॥ చ ॥ అనియిటుజూపివేడుకల

తాంగికిం దద్వనసుందరంబులన్ । గనుఁగొని చెప్పుచున్ మధుప
కాండముఁబోలఁగఁగాంచనంబులున్ । నునుజలిగాలిదోలఁగ ఫ
ణులె పడిబూనినలీలనాసలున్ । ఘనతరవేణులున్ నెరయు గాం
తలుపువ్వులుగోయుపూనికన్ ॥ జయభద్రగణ ॥ కలికిమొగ
మెత్తిననునొల్కు సంపగిపూలు । వెల్కిఁజూచినవిరులఁజేర్చు బో
ట్లుగుచాలు । మేలమునవదమన్న మెలఁగునునశోకంబు । హేలఁబా
డఁగవిరులనిచ్చునుప్రియాళంబు । కన్నెవన్నెఁగనఁగినగడుసుమము
లిడుపొన్న । చిన్నెచేవట్టనన జేర్చు మామిడిగున్న । కులుకుగాఁబ
లుకమలఁగోఁగునీకిఁశువిరులు । నలుపవిడియుమియ చెల్వగమపొగ
డలసిరులు । చెలియమొదజేర్చ వికసించ దేనుమ్రోవి । తెలిసి
యాశ్వాసింపఁ దెరలువాపిలితావి । కొల్లలుగన్లికొను మల్లియల
విడనేల । యల్లపాదిరిసూనములలవరింపుముగోల । మరువంబు
దవనంబు మహిళ మెండుగ దెమ్ము । సురవేసనలయంబుగూర్చ కో
నిశారమ్ము । నారికేళములు ఖర్జూరములు నేదెత్తు । భీరమాకందములు
దెమ్ము నీవదెగోత్తు । పాలఁతివాసనగల్గుపుష్పములనేఁగూర్తుఁ । గలి
కిరుచియగుమధువుకడుమెండుగాఁజేర్తు । మరుమూపునులిచిమా
పుఖాణముజెజిచిప్రవరభటులరస్త్రిల్లనలనువ్రాసఁగఁగజాచి । కోదండ
ములద్రుంచిగుణజీవనముగ్రాచి । మోహమందితిమింకఁబోలఁతినను
నిదిచూచి ॥ చ ॥ అనివనకేళిసల్పవనవాళిశుకీపికపాళియుంబవా । సన
జనిరొంగిలైనలిగిజారని పువ్వులు తేనెపంపులున్ । సనలును జేర్చి
తత్కృషికనంగునిదోడ్కొని జీవమిచ్చిపై । కొనివడియాఱ్చుచున్
గెకలుగొబ్బునమూరుభజింతమంచటన్ ॥ సీ ॥ పుండరీకములనఁ
బుండరీకములొప్పదయను సారంగసంతతులఁబ్రోవ । బహులహా
రులమాట్కి బహులహంసలు ప్రేమ సవిధపున్నాగవిసరముగావ ।
శిఖిహితస్థితులన శిఖిహితస్థితులక్కఁ గొను భుజంగీభుజంగులను
గూర్వ । జతజిల్కచిరతలైజతచిల్కచిరతలగమిసురభిప్రసంగతిఁ
జరింప । రాజహంసాశ్రమముఁబోలి రాజహంస । గణముతోనా
ప్పనొక్కపుష్కరముఁజేరి । తొడవులటువెట్టివలిపెపావడలుగ

ట్టి । శృంగములవట్టినీగాఢచెలులుగదిసి ॥ సీ ॥ కర్ణికాకలశోభసుకాం
డదండవితానకలిత సత్పుండరీకవ్రజంబు । వరచరణశోణగురుశు
భ్రకాంతివద్రాజహంసపక్షిప్రభాతి । దళనేత్రకోరకస్తనవిలా
సస్ఫురత్పద్మినీలాస్యవైభవసమృద్ధి । యమునకిఁ జిల్కరగక్రొత్తవ
రరజస్సముదయభాగ్యాత్రసంభ్రమంబు । నెరయుతమ్మినెమరొక్క
మనీంజాత । వాసదేవతకులుకులంబగున్నేత్ర । ములుచంబులు
నూరులవలెఁ జెలంగు । మీనచక్రాంగజవిభూతి మెచ్చినకోచు ॥ చ ॥
శయములు మూపులూమకోనిచానలుచన్నవబంటినీటని । ర్నయ
వలయాకృతిన్ నిలువరాజిలేఁ దత్పరిధిప్రపూర్తివీ । ద్ధభవభావ
కాబ్జకలహోత్తబిసాంబుజమండలాభత । న్నయనవిబింబితస్థితియ
నాయకలగ్నరుహపాళి నాఁదగెన్ ॥ చ ॥ లలనలుగుంపుగూడుకజలం
బెగజల్లఁగనుత్కరాంబుని । గ్మలగతులొప్పె వేణ్యహివరప్రవృత
స్తనమందరాళివి । చ్చలవిడి మైమథింపగసనార సమైకములాక
రంబువే । జలరుహాషండమిత్రునకుసారెకుదామొర వెట్టఁబోవు
నాన్ ॥ చ ॥ వికచములయ్యె మోముసిరి వేసగి పోలగవచ్చుతమ్ము
లన్ । స్వకచసముత్సముల్ గనగసంపగులండగ లేకవచ్చుభృం ।
గకులము నేపడంచనన కామినులంచిత పద్మినీకులం । బుకడుహారం
చి తేనియలబోసిరినీటవనాటనూద్ధతిన్ ॥ చ ॥ కములవిలాసశృం
గములకాంతలు తేనియనించిజల్లదో । గిమెలగు కామినుల్ వివిధకే
శిస్ద్రిప్పినవక్త్రకేశవి । భ్రమములుమించెఁ దజ్జలజపాళిమథింపను
రందమానవి । క్రమమతిసద్వరభ్రమరకంబులబన్నినవన్నెజూపు
చున్ ॥ మ ॥ ఇటునీరాడిచెలుల్ పయోధివిహచంద్రేంద్రాగమే
ఘాప్సరో । చ్ఛటలక్లైనసబాహుకేశతనువుల్ సౌందగాఁబా
యలే । నటులార్ద్రాంబరముల్ బెనంగతట మొయ్యన్ జేరి కేశా
ళిము । చ్చటమైనార్చి వినూత్నవస్త్రసుమ భూషల్ దాల్చి లీలా
యతిన్ ॥ సీ ॥ పున్నాగములు పైత్రపున్నాగములు కొన్ని ద్విజ
వాక్యసంత్రముల్ దెలుపుచోట । సురసాలములుజితసురసాల
ములుకొన్నిగుసుమరసార్ఘ్యముల్ గూర్చుచోట । వనదీపములున

వ్యవనదీపములు గొన్నిబంభరధ్వాంతముల్ బాపుచోట। రవికాంతములు దివ్యరవికాంతములు కొన్నిసుమ సమూహరతుల్ జూపుచోట। గలికిపన్నీటఁబుష్పాడిగలిపితిన్నె। పలిపిలయకాయమానంబులలినమస్సి। యబ్జదళములమరునిందునసిలుఖగకు। లాళులనుద్రాసియబ్జాసనాళినిలిపి॥ శా॥ ధ్యానావాహనపాద్యసమ్యగభిషేకాసూనగంధప్రసూ। నానీకాంచితధూప దీపములుదిత్తాయాజగద్వ్యాపకా। శ్రీనారాయణపుత్రవార్థిజసుతావిద్యాయయానాజగ। త్త్రాణాచంద్రహితాసు విక్రమవిహారా నీకునంచిచ్చుచున్॥ చ॥ వనచర కేతనాయసుమ వారశరాయరసాలకార్ముకా। యనిబిడవిక్రమా యభువనావనదివ్యబలాయతేన మో।యనుచునుద్రెుక్కి శక్రతనయానుపుర స్సరులైవధూమణుల్। సనయతవిన్నవించిరిలసత్పికవారకలారవంబునన్॥ సీ॥ సాత్వికంబున నెరసతిబూనదేహరిసీకీర్తిమదినుంచినీకజాస్త్రి। తమముమైగిరికంధరము జేరఁడేశూలినీకీర్తిలరాల్చినిఖిలజైత్ర। రాజసమునసీశరముదూరఁడేవిధినీకీర్తిగతిగాంచిలోకమిత్ర। తాపంబుమైమహీధరమెక్కఁడేరవినీకీర్తిచేబూనినీటుకాఁడ। యహహానీకేతువైరెంటినంటజేయు। శరకశకసాక్షిరెుత్వదాజ్ఞావధూటి।రసనదాలివిమరితూసంద్రబుజేరి। వెలయరేవారలిల మహాబలతురంగ॥ ఉ॥ మేరువుప్రూరిశేషుఁడళి మించుకమేశుఁడుపూవుధర్మముల్। నారిశరంబుసాంగతయనంగతలుల్ దగమూడుపల్లెలన్సారజగత్త్రయంబుపెలుచన్ హరుఁడీవునుగెల్చులానుబల్। నేరుపుమైదలంచిననునీబలవైఖరిదోచదేస్మరా॥ మ॥ స్మరనీకీర్తిని మేనదాల్చుహరుకన్ సారేకరంబఁదుబూ। సురమాధీశునిగర్భమున్ రసనయందున్ దాల్చువాణీశ్వరో। దరమున్ జొచ్చిననీప్రతాపమునునోర్వన్ లేమిగాత్వత్సుకీ। ర్తిరుచిన్ బొల్చునదీనవహించికలశాబ్ధిన్ గంజమున్ జొచ్చుటల్॥ క॥ శిరమెక్కెనీయశోంగన। యురమెక్కెజయాబ్జనిలయయెుగికడుపానేన్। నెరయంగనీవితీర్ణిమ। ధరసోమసమాత్మజులకుతామరసాస్త్రా॥ చ॥

బలియుఁడపీవు శరవ్యశయి వారకనంబుజపత్రనేత్రినీ । యలికులవే
ణినబ్జముఖి నక్కట యేచుటలో నెమారయుం । చె ॥ మిసి వేడ వేళవి
రులెల్లెడ ప్రాలపి కాళిక్రీనముల్ । కలకల మ్రోయఁగాంతనరుగాం
చినయట్లు యిస్సోలమానిసల్ ॥ మ ॥ ఘనమూర్చాశ్రమలాపమా
రకువలాన్యధ్వాంతబోధ్యత్స్ఫుటా । గ్నినవాస్త్రోద్ధతిబాలదృక్కు
చఫుంస్నేహాసుకంజారికాం । చనతైలప్రసవాళి వేగహమముల్
జంద్రార్చిసప్పల్లవా । గ్నినిపాటీరజలంబువ్యంతహాతి నెంతేగూ
ర్చరాదంచాగిన్ ॥ చ ॥ కవగొనిసంభ్రమించు చునుగంజనవోత్ప
లచంద్రవాలప । ల్లవసుమగుచ్ఛపాళి సికళావతివక్త్రసుదృక్కపో
లకే । శవరకుచంబులన్ నిలిపి శైత్యమెసంగఁగఁ జేసి కాంతలి । య్యా
వలకుమారసౌఖ్యకరమనందగ జేయుమటంచు వేడినన్ ॥ చ ॥ అల
రుచిరోత్పలన్ నిజవరాహ్వయమున్ చెవిసోకసంజగా । నలరెడి
కల్వబోలెఁ జెలియాననమెత్తిన గ్రుచ్చివట్టికో । మ్మలుమనపూజమె
చ్చి దయమారుఁడుసన్నిధిఁ జేసెనమ్మరో । గలఁగకుమంచు తోడు
కొని కాంచనధామము జేర్చు నంతలోన్ ॥ చ ॥ కరముఖనేత్రపా
దపరికల్పనబాంధవమొప్పఁ జూపుసుం । దరకమలన్ దయారహిత
తన్ గమలంబులు మారునమ్ములై । సరిసరి నేచసాగెనలసంపదపా
లనజేయ నేలదో । షరుజనడంతునంచన వెసన్ రవివిగ్రుంకె నురోష
మూర్తియై ॥ సీ ॥ భూరివసూత్కరస్ఫురణచే వెలసిన పద్మినీతతిము
ఖాబ్జములు మోడ్చె । మునుమున్నుబారుచు వినయాప్తిఁ గొలిచిన
జాయవెంబడిఁబడిచనకమారలె । సమధికఫలలుబ్ధ సంచారిఁజరించిన
యాప్తచక్రములొంటులగుచుఁబాఱె । సర్వలోకముల తత్సంస
క్తి నేలిన యకుటిలప్రభ మెసఁగక నెడిలెదె । నినుఁడు పరసక్తి పిషరా
శిమునిఁగినపుడె । యేఁగుణ మెన్నజడజాతిలోలమలిన । గతియరి
ప్రతతివిచంచమతియటంచు । దినసతీమణి సంధ్యాగ్నిఁ బెనచిసమ
సె ॥ చ ॥ విలసదభీష్టకాంచితరవిప్రచురోరుమరుత్పటం దము ।
న్లలితవిభూతిఁ గనయున స్ఫురదంబుజమోదదస్థితిన్ । గులుకున
నాడుచుండఁగనకుంఠితసాంధ్యమరుత్వరన్ భ్రమం । బెలసిన రీతి

వార్ధివడిమోఁదినబాలుఁడుముకుందనయ్యెడన్ ॥ చ ॥ ఘనివడి వేష్కఁ
గాలరసవాదిది వాకరబింబమున్ రసం। బునువరరాగధాతువుల
బూడివిగ్రట్టిపమోదలోహఘం। డనిచయుముల్ సువర్ణశకలంబు
లచేయనజాండమున్నమూ। పనుఁడియూదెసంజయునుసారజు
చిన్ విశదానిలోద్ధతిన్ ॥ మ ॥ అరయన్ బుధ్యమూర్తిమెప్ర
బలిదానాసారధారాధృతి। స్ఫురణన్ మించుచుఁ గౌశికాంబకము
హోమోదంబుగల్పించుచున్। గరిమన్ గాంకవినేత్రవైభవము జి
క్షన్ జేసి వేధోండమల్। స్థిరతన్ నిండెనమేయశార్వరవటుశ్రీమూ
ర్తిమేకాకృతిన్ ॥ సీ ॥ గోపికారతిఁదేలిగోపాలుఁడౌసఁగినఘనతరో
ద్యత్త్రివిక్రమసుమూర్తి। మునిదారగతిఁదేలియనలాక్షుఁడౌసఁగినఘ
నమహాలోకఘనగనవిభూతి। గౌతమీరతిఁదేలిఘనవాహుఁడౌసఁ
గినయలఘునాఘనవిగ్రహాతికాంతి। గురువధూరతిఁదేలిహరిణాం
కుఁడౌసఁగినవనపుండరీకవర్ధనసువిద్య। గనుచువారిచూడాపింఛ
కంఠభూష। నాశ్మవక్షోంకములయికాంతాకరాంజనంబయినదీని
తలఁదాల్చియంబకములఁగప్పనగుననివిబులెన్నఁగదిసెనిరులు ॥ గీ ॥
బంధుర స్నేహపాత్రవైభవమువలన। శార్వరాగమనమునకుజాతి
బొంది। యరుగుమిత్రునివసువులనాత్మధామ। ములనుజేర్చుచుగృ
హదీపకళికలమరె ॥ చ ॥ శమువడికాలలేఖరిలసత్కషపటంబునకాంశ్య
శిష్టసం। క్రమరసపుష్టినీరరుహకాండయశోమయహ్యాశ్యపశ్యసం।
ఘుములిఖియించిసంతమసకజ్జలచర్చయొనర్చెమైనసీ। రముడగజ
ల్లచుక్కలనరాజిలెఁగచ్ఛితవర్ణజాతముల్ ॥ చ ॥ శతదళనేత్రపాంసవి
లసద్ఘనమస్తకమైనిశామరార్చితహరిచందనప్రసవబృందముతో
డుత దేవదీప్తికన్। స్తుతమతిఁదాల్చెనానభముఁ జూడఁగనొ
ప్పెవినిర్మలోడుసం। తతితొలిదెల్పునొప్ప భువనంబులభంగిని
రూఢియొప్పఁగన్ ॥ మ ॥ వరతారాంబుకణాళిఁబర్వఁగన భోవా
రాశిదర్వింగ శ్రీ। కరలీలాయతిఁబుట్టిప్రాగ్నితతరంగస్తోమమున్
బాయుసుం। దరలక్ష్మీమణిపట్టఫాలముఖముల్ దళ్కొందుచున్
దోచెనా। హరిణాంకుఁడుదయించె రేఖయుసగంబై బింబమైతూ

ర్పునన్ ॥ చ ॥ హారిసుకళంకదేహమును దంచితబింబఘనేంద్రమున్
జకో । రరుచిరదేవబృందమును రాజితసారసుధా త్తచంద్రికా।
శరధియు నైచరాచరము సంస్థితినుండినపాదధారవై । ఖరిఁగురి
సెన్ హిమంబు త్రిజగంబుపవిత్రతఁగాంచిమించఁగన్ ॥ మ ॥ ఉ
దయాగాభ్ధితటాగ్రమందుసరిగో హ్యాద్యాంశుఁడై యవ్విధుం। డ
డనన్ శార్వరసంకులాక్రమిత బ్రహ్మాండషోషధీభాండమిం। పొద
వన్ నైగ్రకొనితద్విరోచన జచక్రోష్మాగ్ని రాకొట్టివో । యదగన్
ద్రావేఁజకోరదేవతతియొయ్యన్ జంద్రికాంచత్సుధన్ ॥ సీ ॥ జ
క్కవలకెగాదుజంపతీవిశ్లేష మవనిలోసకలార్థ్వగాళికెల్ల । కల
శాబ్ధికేగాదుగడగిమిన్నందుట సముధికోత్తమచకోరములకెల్ల।శ
శిమణులకెగాదుకృశమయ్యెకరగుట సకలవిరహిమానసములకె
ల్లఁ। గలువలకేగాదుసలలితామోదంబు సకలస్వార్థిభర్తృకల
కెల్లఁ। గలుగఁజేసెనుతుసియశశికళికయనుచు।గగనగంగాపయో
ధులుకాంతుమిర । లీలనుతరంగభవ్యడోలికలనునిచి । యూచు
గతిఁదద్రుచులునీటనొప్పగులికె ॥ చ ॥ కువలయమోదమున్ జెరు
పఁగూడకమిత్రసతీప్రసంగలీ।లవడయనోపకేచియు గలన్ వడిబొ
చుటలోపకన్ మహీన్ ।బవలోనరింపఁబద్మినులపైనయఁజూడఁగఁ
జక్రపోషణం । బువడయనేరనయ్యెనల భూరికళాకరచంద్రికా
వళుల్ ॥ వ ॥ వెండియునప్పుండు వెన్నెల బ్రహ్మాండభాండంబులనిండు
కొను చంద్రఖండంబులగండు బెండుపడి మెండయి చకోరవా
రంబు సారె సారె నోహూర నాననాన దేనియల సోనలబోని
రుచుల విచికిలత్వంబువహించి - మెఱుంగుగనికరంగకురంగధర
గ్రావజాతనూతనస్రోతోవిసరంబులఁబ్రతిఫలించుచందురుని చం
దంబుగనియానందంబు నందెలిగలువబృందంబని కైకొనంజేరు
ముగ్ధలవైదగ్ధ్యంబుగేలిసేయుపోలికమేలంబునఁగవయఁదివురువి
టులజారుగొప్పులంజారుబొండుమల్లియలదండల ఫిండుతోనండ
గొని- కచగళత్సుమపుష్పంబులమణితమాత్రంబుల- పతులతోర
తుల్రగతులనతులమతులరతిపతిబూజించుచు ధ్యానపరవశలయిన

యిటులనీటునరతాంతని మీలితేక్షణలగు మధ్యల నాసామౌక్తిక
కాంతులతోడాంతరలాడుచు - శ్రమబిందుకరకాని కరభూషణేం
ద్రచాపవిలోకనవిద్యుల్లతాతాంబూలబిందు శక్రగోపగళరవస్త
నితకచశిఖిపింఛప్రసరణాంగస్రవత్స్వేదఘనపుష్పాసార సాంద్ర
మైవర్ష ర్తుభ్రాంతిగల్పించుప్రౌఢల పుంభావ ధువనసంరంభంబు
నకళంకంబున శరదృతువిశేషంబుచూపట్టుచు - నొద్దిక మెయినద్దం
బుల ముద్దులొసంగుచుముద్దుమోములనుద్ది గనిద్దగుంగద్దరితనం
బునంజూచుచు సౌధాగ్రంబులపద్దు మీరిపెద్దయుద్దండనృపతుల
తోఁగూడిభుజించుస్వాధీనభర్తృకలక్ష్మీరాన్నసముంచితకలధౌత
పాత్రంబులను మెఱుంగులొసంగుచు - భూషణకుసుమగంధవస్త్రా
ద్యలంకారంబులతోఁగుసుమశయ్యలనొయ్యారంబుగరచియించి
కొనిమించునించుకాంద్రరాకనిరీక్షించువాసవసజ్జకలవజ్రహారవా
రకాంతులతో మేలమాడుచు - సితరాంగనానంగ సంగరరంగసం
గమంబులనంగంబులనంగదట్టంబుల మృగనాభిహరిద్రాదిపంకం
బులంకురింపతడవొనర్చి వచ్చినమగల మిసులందెగడుఖండితలస
రోషవీక్షణరుచులకు ధావళ్యంబుల నిల్పుచు - తమనిరాకరణంబు
లకలిగిప్రియులరుగ వెలుగుపడి కోయకకోయకాయజునిమాయ
గలసాయకముల రాయిడిపోయనిపాయక వాయమ్మెమొడ
లతముదామెమూరికొను కలహాంతరితలలది మరలరాల్చులోద్ర
చూర్ణంబుల వెండియు కీర్ణంబులగావించుచు - కడుతనవాంద్రిన
వలకాంద్రవెదకుచు ధవళాంబరమాల్యాదులంబూని వారిజేగ
నగుగునభిసారికలకు - నెసంగుముసుంగులొసంగుచు - పరదేశ
వాసులగు నాథులందలంచిదలంచి యుదంచితమదనాంబకకదం
బకదంబఘాతంబులకు మోదంబు వహించివేగుప్రోషితలముఖం
బులపాండురతలసిండింపుచు - వరులయాలస్యంబు సైపనోపక
తాపకలితహృదయలై - సుఖంబులత్యజించిచింతించు విప్రలబ్ధల
ముఖాంబుజంబులకు ముకుళనంబులొసంగుచు - పరువంపుటుసు
వడి యడంగగడంక మెయికంతుదురంతక్రీడలఁగూడుకొనవేడ్క

మెయిరాకదిరుసుకాంతుల వలవంతలనిందించుచుఁ బొగులువిర
హోత్కంఠితలకై లెడలవల్లభులరూపంబుల్లి కొనం జూపుచు-
చిత్తజపరవశత్వంబును గాదంబరీమదోన్మాదంబును నెరయను
వనులఁ దిరుగుచు- పల్లవశయ్యలకమలశయ్యలనియు - జలం
బులనిరానాకంబులనియు - కస్తురినిగప్పురంబనియు సంపగులనిం
పగుమల్లెలవిరులనియు నుపయోగించుచు- నిజాననాంబుజంబులంబ
ట్టి నవారుణాధరులకు దాపుచువారుకే సరససపంకేరుహలఖండం
బులని చకోరమోవిచునుక్కనసొక్కన సొక్కవడిమే నెలుం
గకనుత్త బిత్తగలవడియుండుశబరాక్షీరమ్లెచ్ఛస్త్రీయవనసామాన్యా
దికామినీ లోకంబులను మానపోషణానూనద్రవ్యధనళి వస్త్రజా
లంబులనొసంగుచు- మేలంబు మెయి- రేపటిదంపుసూనికిజనివచ్చెదని
చ్చటనుండు మనుపతులపలుకులనుమన్నికంకణంగతిగ నునూన్మిక
లవలెనశ్రువులెసంగ-నీవిందందంబునసుండుపనియేమి నాకనుత్కృ
కార్యంబులనీరాకదాకనుండుతుండిగమనకుంబలికిజనుమనిపలుకు
లలనలకలధ్వనులకుఁబూయుకర్ణికారంబులవర్ణంబులఁబూరంబులుఁ
జేయుచు-సద్గములనిద్గంబులగుచుక్కలనఁ-గమలసళంబులనెలకొను
కణంబులనఁ- జెమ్మటశ్రమబిందువులురుల - నిండునెలంగప్పిన
మెఱుఁగొప్పు గొప్ప మొగులన - తమ్మిపైగమ్ముకొనుతు మ్మెదది
మ్మనవెమ్మొగమ్మునకచమ్ములు నెరయఁగమలకోశంబులనడరి నవ
రాళనఖక్షతంబులన - చక్కవపెంటినిమగండునొక్క ననొక్క
లన-యుబ్బునిబ్బరపుగబ్బిగుబ్బలన ఖతక్షతంబులు చెలంగ - మదన
భాండారంబు కొల్లలుగానుల్లాసకేళుల నల్లిబిల్లిగనల్లి కొని వెనం
గుయువమిథునంబుల పయికుసుమవర్షంబులుగురియుచు - జెలంగె
డినసఁజెలంగి కాదంబినులు- కాదంబినులును-రాజితాచలంబులు-
రాజితాచలంబులును-స్థాణువులు- స్థాణువులును - క్షీరంబులుక్షీ
రంబులును గాసుధావీచీ సధ్రీచీనంబయి బెనుగుచుండు నవసరం
బున|| మ|| అతనుక్లేదనరానిలంబులను క్రేతాగ్నుల్ గలంచఁగాఁగ
టాసుతియొత్తొర్చునతత్కాలంబకకళాశైత్యంబుదృగ్వక్త్రజీ।వ

